ఒక గాడిద సముద్ర తీరాన ఒక చిన్న ఊళ్లో ఉండేది.

దాని యజమాని ఎర్ర గడ్డం కలిగిన యువకుడు.

ప్రతి రోజూ యజమాని ఆ గాడిదను రేవు దగ్గరకు తీసుకుని వెళ్లేవాడు.
అక్కడ పెద్ద పెద్ద పడవలలో సరుకు దిగేది.

రోజూ గాడిద మీద యజమాని పెద్ద పెద్ద బరువులు వేసేవాడు.
ఆ బరువైన సామానుని గాడిద ఊళ్లో వరకు తీసుకుని వెళ్లాల్సి వచ్చేది.

యజమాని, గాడిద మెల్లగా నడుచుకుంటూ వెళ్లేవాళ్లు. యజమాని ఆ సమయంలో పాటలు పాడుతూ ఉండేవాడు, గాడిద బరువులతో మూలుగుతూ ఉండేది.

గాడిద ప్రతి రోజూ అలసిపోయి నీరసించిపోతోందన్నది ఎర్ర గడ్డం యజమానికి పట్టలేదు.
ప్రతి రోజూ గాడిద మీద వేసే బరువు పెరుగుతూనే ఉంది.

ఒక రోజు గాడిద యజమాని ఒక చిన్న ట్రక్కు కొన్నాడు.
“ఇప్పుడు నీ అవసరం నాకు లేదు," గాడిదతో అతడు చెప్పాడు.
యజమాని ట్రక్కులో వెళ్లిపోయాడు.

మొదట్లో గాడిద సంతోషించింది. "ఇప్పుడు నేను బరువులు మోయనవసరం లేదు," అనుకుంది.
"కానీ, నాకు ఇప్పుడు ఆహారం ఎవరు పెడతారు?" అది ఆలోచనలో పడింది

గాడిద అవసరం ఉన్న వ్యక్తి దొరుకుతాడేమో అని అది చూసింది.
పోస్ట్ మ్యాన్‌కి సైకిల్ ఉంది, అతడికి గాడిద అవసరం లేదు.

పోలీసులకు కూడా అతడి అవసరం లేదు. వాళ్లకి వేగంగా వెళ్లే కారు ఉంది.

గాడిద అవసరం ఎవరికీ లేదు.

రైతు దగ్గర ట్రాక్టరు ఉంది.

గాడిద ఎంతో విచారంగా ససముద్ర తీరానికి వెళ్లింది.

అక్కడ చాలామంది పిల్లలు ఆడుకుంటూ దానికి కనిపించారు. ఒక చోట పిల్లల గుంపు ఉంది.

వాళ్లు గుర్రపు పిల్ల మీద సవారీ కోసం వేచి ఉన్నారు. చాలాసేపటి నుంచి వేచి ఉన్నందువల్ల వాళ్లంతా కోపంగా ఉన్నారు.

“వచ్చి నాకు సహాయం చెయ్యి," గాడిదతో గుర్రం యజమాని అన్నాడు.
గాడిద కూడా పనిలోకి దిగింది. పిల్లలందరికీ సవారీ లభించింది.

గుర్రం అంత బాగా గాడిద లేకపోయినా పిల్లలు అంతగా పట్టించుకోలేదు. పిల్లలందరూ ప్రేమతో దాని వెన్ను తట్టి, రకరకాల పదార్థాలు తినిపించారు.

సూర్యుడు అస్తమించాడు, రాత్రి కావస్తోంది. అప్పుడు యజమాని గుర్రంతో,

“పద, ఇంటికి వెళ్లే సమయం అయ్యింది."

గాడిద కూడా తమతో వస్తే బాగుండునని గుర్రానికి ఉంది.

“సరే, గాడిద కూడా మన తోనే వస్తుంది," అతను అన్నాడు.

అప్పుడు గాడిదకి ఓడరేవు దీప కాంతులు కనిపించాయి.

"నా పాత యజమాని ట్రక్కు చెడిపోకుండా ఉండాలి," అని అది కోరుకుంది.